అనుబంధములు.

ధర్మా— అసారంబిదెంతయీతనువు-తల్లిరో
తల్లిరో-తల్లిరో-అసత్యమగుచు-అసత్యమేకలుగుచు ||పల్లవి||

మోహి— ప్రాణంబులనీ-పగిదింబాయ
నానందంబగునో కో-కుమారా||

రుక్మా— శ్రీహరివాసర-సిద్ధితలపనీ
దేహంబెక్కు-వయే-యసారం||కుమారా||

మోహి— ఏకాదశియన-యెంతటిదయ్యా
పోకార్పంగనసువుల్ -కుమారా||

19 ధర్మ—రాగము-జోగిసావేరి ఆది తాళము.

ఈమాటడంగదగునే-జననిరో
భూమిధర్మములువలదే-కడు-ప్రేమ
నించుచునుగనుమా|| ||పల్లవి||

ఈకాయంబదియెంత-జననిరో
హితవుచూచికనుమా-నాకు
నీ-మృతియే భాగ్యమా ౧

ఘనమగుపుణ్యముగలుగుచు
జనకుని-కన్మృతముతోలంగంగజేయచు
తనువునుగణనముసేయచు||

20 ధర్మ—రాగము-ఆనందభైరవి ఏక తాళము.

హరినారాయణ-మాధవశౌరి
సురనాథాదర-చక్రిమురారీ|| ||పల్లవి||

గరుడాంచితబహురమ్యతురంగా ౧
పరిపాలిత-సారంగమురారీ||

21 లక్ష్మి—రాగము-కమాజు ఆది తాళము.

అళికులాలక-మెచ్చితిని|| ||పల్లవి||

భళి-భళియనరె-సంధ్యావళీధరణి|| ||అను||

నీమగని-నేమమును-ప్రేమగని-ధీమతము
వేపూసమెచ్చితి-భామామణిరో|| ౧

ధారుణిని-నీరమణు-ధీరమతి-నారయుచు
ప్రేమమునించితి-భామామణిరో|| ౨

———:0:———